# పుష్పవల్లి



కృతిభర్త :

శ్రీ మొదుంపురం రాజేశ్వరాచార్యులు

రాజశ్రీ సాహిత్యగోష్ఠిము—రాజేశ్వరగ్రంథాలయము

వ్యవస్థాపకులు, సికింద్రాబాద్.

# ఆమోదము

"పోతనభావం బరయుఁగాఁ బూతం బగు ననుట లెస్స పుడమిని నెప్పుడున్। పోతనభావం బభినవ పోతన్నా! నీది యనుట పోలదె? మునులన్" పోతనభావ మభినవపోతనదియు నగు. శ్రీ యుభయభాషాప్రవీణ కోగంటి దుర్గామల్లికార్జున రావుగారిదియు నగు. కారణము వారి "ఉపాధ్యాయుఁడు" అను పద్యములందే కనవచ్చును. "తిరిగినందువలనఁ జెరిగి పోయె వ్యయమ్ము" ఇత్యాది. పోతనభావము లన్నియు సమకూరుట చాల కష్టము. ఎవరికోగాని ధ్యేయసభక్తిభావ మేర్పడును. కొన్నికొన్ని కొందఱియందుఁ గుదురుకొనును. స్వాతంత్ర్యము భగవదంకితముచేయుట మున్నగు సద్గుణములు కీ॥ శే॥ మంగిపూడి వేంకటశర్మగారియం దున్నవి. కొన్ని సద్గుణములు స్వచ్ఛమయిన సేవ, భాషాసేవ, సంఘసేవ, పెద్దలయెడ గౌరవము, వినయము, విధేయత మున్నగు లక్షణములు కోగంటి పండితుని యందు నెలకొనియున్నవి.

శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారి తోడి పరిచయము కొద్ది సంవత్సరముల నుండి మాత్రమే నాకుఁ గలిగినను వారి శీలసంపత్తిఁ దెలిసికొను నవకాశము లనేకములు కలిగినవి. తెలిసికొనినాను. ఆంధ్రుల మన్ననల నందవలసిన వ్యక్తి యని గ్రహించినాను.

శ్రీ రావుగారు ముఖ్యముగాఁ బరిశోధకులను, పండితులను, కవులను, చిత్రకారులను, గాయకులను, సన్మానించి యథాశక్తిని వారికి బహుమానము లొసంగుటకుఁ బూనుకొని భారతీసన్మానసంఘము పక్షమున నా కార్యక్రమమును

# పండితాభిప్రాయము

నీవు హృదయపూర్వకముగాఁ బంపిన "పుష్పవల్లి" అను గ్రంథములోని పద్యములను నే నిదివఱకే యప్పుడప్పుడు పత్రికలలోఁ జదివియుంటిని. బాలురకు సులభముగాఁ దెలియునట్లు స్వభావసిద్ధము లైన తెలుఁగుపదముల కూర్పుతో జనసామాన్యము వాడుకొను నుడులతో నిండి నీ పుష్పవల్లి శోభించు చున్నది.

ధార ధారాళముగా నుండుటచేఁ దెనుఁగుపదముల తీరు తియ్యములు సరళములయిన చిన్న చిన్న సంస్కృతసమాసములు నీకవితయందుఁ బొందుపడి విచ్చలవిడిగాఁ గన్పించు చున్నవి. శైలి కుంటు పడక సంస్కృతపదజటిలత కాశపడక సులభమై యుదతి దక్షిణమై మనోజ్ఞముగా నున్నది. మఱియొక విశేషము- కొన్నిపద్యములలోఁ జెప్పిన పాఠములు పునరావృత్తి చేసినను నవీనభావములు కందళించు నైపుణ్య మీ కవితకె నలవడినదన్న సాహసోక్తి కానేరదు.



గురువునిఁ బూజించినచో
వరయశ మొనఁగూడు నంద్రుఁ వసుమతియందున్
గురువునిఁ బూజించిగదే
వరయశ మొనగూడె నీకు వసుమతియందున్.

ధారాళివాక్సరణియు, నిమ్నోన్నతములు లేక సమతల ప్రవాహము గల సెలయేటినిఁబోని శైలియుఁ గలిగి కవిత్వము ద్రాక్షాపాక మయి వెలయుచున్నది. కవిత్వమునందుఁ బాదపూరణము కొఱకుఁ దెచ్చిపెట్టుకొనెడి వ్యర్థపదములు లేవు. యతిప్రాసలకొఱకు వెదకికోలు గాన్పింపదు. సంస్కృతపదములకంటెఁ దెలుఁగుపదము లధికముగా నున్నవి. తోఁచిన భావములు సులభవచస్సరణితో స్వకీయకల్పనలతోఁ బద్యములు సువిభక్తములై సొంపు గలిగి యున్నవి. కృతిని జనసామాన్యమనకుఁ దెలియు నట్లు రచించినవాఁడే సుకృతి.

సముచితం బగు మృదుపల్లవములతోడఁ
బ్రమద మొదవించు భావపుష్పములతోడ
రక్తి నింపెడు ప్రణయసౌరభము గలిగి
బుధుల రంజించు భవదీయపుష్పవల్లి॥

విద్వాన్ తిపిశ్నని వేంకటసుబ్బయ్య,
ఆంధ్రపండితుఁడు, బోర్డు హైస్కూలు, వసుమఱ్ఱు.



ఓం

# పుష్పవల్లి

రామప్రశంస 24—6—1925

మిత్రవంశమునందు జన్మించినావు
దశరథున కాత్మజుండవై తనరినావు
సకలవిద్యలు చిననాఁడె చదివినావు
కౌశికుని రక్కసులనుండి కాచినావు
నాతి యవునట్లు ఱాతి నొనర్చినావు
ఈశ్వరధనుస్సు నవలీల నెత్తినావు
అవనిజాతను బరిణయ మాడినావు
అఖిలరాజుల సంస్తుతి నందినావు
పరశురాముని రోషించి పరగినావు
తండ్రియాజ్ఞను శిరమునఁ దాల్చినావు
అనుజుతో భార్యతో వని కరిగినావు
చిత్రకూటము నందు వసించినావు
దనుజులను బెక్కుమంది నుక్కణచినావు
స్వర్ణమృగమును శరముతోఁ జంపినావు
పవనపుత్రుని సాయమ్ము వడసినావు
అల్ల సుగ్రీవుపాలికి నరిగినావు
చెలిమి యతనితోఁ గొంకక చేసినావు
శౌర్యశాలిని వాలిని జంపినావు
ధీరతన్ జలరాశి బంధించినావు

లీలగా రావణుని సంహరించినావు
పరమపావన సీతఁ జేపట్టినావు
ఎలమి సాకేతపురమున కేఁగినావు
ఎల్లరును మెచ్చఁగా రాజ్య మేలినావు
పాయ కేవేళ మమ్ముఁ గాపాడు మయ్య
రమ్యసద్గుణసాంద్ర! శ్రీరామచంద్ర!

## క్రొత్తపెండ్లికొడుకు

25-8-1922

అత్తమామలు నీకు మర్యాదతోడఁ
దిను తిను మటంచు నెన్నియో తెచ్చిపెట్టఁ
దినుచు నీటుగ గోటుగఁ దిరుగరాదె?
అత్తమామలు గౌరవమ్మటంచు నిన్ను
బంధువును నీ గృహమునకుఁ బంపినంత
నలుకతో రాను రా నంచుఁ బలికె దేమి?
జనకుని కయిన నొక్కింత జడియవేమి?
అనుగుఁ దల్లియు బ్రతిమాల విన వదేమి!
అత్తవారింటికన్న నీ తత్త జేల?
ప్రీతిగలుగదె? ఓ క్రొత్త పెండ్లికొడుక!

## గాంధి

8—10—1924

నవలావణ్యము గల్గినట్టి తనువున్ నానాఁడు స్వార్థప్రియుల్
నవయం జేసినఁ గాఱులన్ బలుమ అన్నన్ గోపముం బూనవే
శివదేవుండవొ రామమూర్తివొ యల శ్రీభర్తవో గాంధి! యే
యవతారమ్ము ధరింప కున్నఁ దరమే యారీతిఁ జేయన్ ధరన్

# నీతిపద్యములు

11—12—1924.

తే॥ హాస్యమునసయిత మనృత మాడరాదు
పరుషవాక్యము లెన్నఁడుఁ బలుకరాదు
చెడ్డవారితో స్నేహమ్ము చేయరాదు
పరులవిత్తమ్ముపైఁ గాంక్ష పనికిరాదు।

తే॥ ఎల్లజీవులఁ దనవలె నెంచవలయు
సూరిజను లన్న వినయమున్ జూపవలయుఁ
జెడ్డగుణములను బరిత్యజింపవలయుఁ
బరులసేమమ్ము నెల్లప్పు డరయవలయు॥

తే॥ కంటి కెదురైన కాంతలఁ గాంచవలదు
సాధుజనులకుఁ గీడును సలుపవలదు
కుమతులిండ్లను భుక్తిని గుడువవలదు
శిష్టజనుల నెప్పుడు నిరసింపవలదు॥

తే॥ మద్యపానము చేయుట మానవలెను
ఖద్దరున సంతతంబును గట్టవలెను
మాంసభక్షణమును వడి మానవలెను
గులము చెడకుండఁ గాపాడుకొనఁగవలెను॥

తే॥ సాటివారిని హేళన సలుపఁదగదు
చీమనైనను హింసను జేయఁదగదు
పనులుచేసెడివేళ సంభ్రమముదగదు
తాల్చుట విదేశవస్త్రముల్ దగదు తగదు॥

## తిరుపతి వేంకటకవులు 29—3—1925

వధానమ్ముల నెన్నో చేసి విబుధాహ్లాదమ్ముగా సంతతం
వలీలన్ సకలాంధ్రభూభుజ మృగేంద్రానీకమున్ గాంచి స
వితాధోరణి నైపుణిన్ దెలుపు నుద్గ్రంథంబులన్ వ్రాసియా
పవినిం దిర్పతి వేంకటేశులు యశంబుం గాంచి రత్యంతమున్॥

## కూడదు 2—4—1925

॥ కూడదుకూడ దెప్పుడును గోపముఁబూనుట మాటిమాటికిన్
గూడదుకూడ దెప్పుడును గుట్టును దెల్పుట బాంధవాళికిన్
గూడదుకూడ దెప్పుడును గోవిదనిందయు ధాతుణీస్థలిన్
గాడదుకూడ దెప్పుడును గొంతెమకోర్కెలు గోరుచుంటయున్.

## గురుధ్యానము 8—4—1925

ఖమం బింతయునైనఁ దాల్పక మనఃకంజంబునం దప్పిదం
లు మన్నించుచు సర్వకాలమును సమ్మోదమ్ముతోఁ బుత్రవ
లతన్ జూచుచు మచ్ఛుభంబును మదిం దాఁగోరి కావ్యంబులన్
లియం జెప్పిన మద్గురూత్తముని ప్రార్థిన్ నేను ధ్యానించెదన్॥

## ఆంధ్రభారతి 23—4—1925

ముద్దులుమూటఁగట్టుపదముల్ వచియించుచుమాటిమాటికన్
బెద్దలవెంటఁజేరి కడుఁ బెంపువహించితి వింతదాఁక నీ
వద్దిర ముందుఁ గూడఁ దగ నట్టులె వర్తిలు దారిదప్పిపో
వద్దుసుమీ యనారతము భద్రము చేకొను "ఆంధ్రభారతీ!"

# గర్వము

7—6—1925

తే॥ వైణికుండనైన గాయకవరుండ నైనం
బరమసౌఖ్యమ్ము గల్గినవాండ నైన
భూరిరోగములేని శరీరి నైన
గర్వమా! నన్ను ముట్టకే కాలమందు॥

తే॥ విమలగుణశోభితుండ నైన సుమతి నైన
బుధవరుండనైనను మహాభోక్త నైన
యోగినైన సమున్నతోద్యోగినైన
గర్వమా! నన్ను ముట్టకే కాలమందు॥

తే॥ మాన్యుండనయినం గవిశిరోమణిని నైనం
దరణిపుత్రుని మించినదాత నైన
నవ్యతరశేముషీ ధురంధరుండనైన
గర్వమా! నన్ను ముట్టకే కాల మందు॥

తే॥ అర్థవంతుడ నైన యశోర్థి నైనం
బురుషపుంగవుండ నయినం బ్రౌఢనైన
వివిధశాస్త్రపురాణార్థవిద్యుండ నైన
గర్వమా! నన్ను ముట్టకే కాలమందు॥

# మంత్రిశేఖరా

మంత్రిశేఖరు లగు శ్రీ పానుగంటి రామారాయణింగా
రంగలూరు విచ్చేసినపుడు, 8—6—1925

ఉ॥ రాకయు రాకవచ్చితివి రమ్యకరం బగు చున్నయట్టి మా
రాకయు రాకయయ్యె నను రాగసమన్వితచిత్తవృత్తితోం,

శోకరయమ్మునన్ నిఖిలముంబాడగాంచుచు పానుగంటి
శ్మాకరచంద్ర! సర్వమనుజాళివశంకర! మంత్రిశేఖరా!
ఉ॥ కృష్ణసపర్యలందు నొకయించుకలోపము గల్గనీయకన్
బొచ్చెముగాఁదలంపక సమంగరుణారస దృష్టితోడనన్
గ్రిష్ణుఁజూడుమయ్యనిముఁగాంచియొసంగెడిపద్యరత్నముల్
ముచ్చటగాఁగఁ గైకొనుము పుణ్యగుణాకర! మంత్రిశేఖరా॥

## శ్రీ లచ్చారావు 19—7—1925

సీ॥ శతకసంపుటములు సాంతమ్ముగా కుండ
నింతలోనే దివి కేఁగినావ?
సల్పెడుకార్యమ్ము సఫలమ్ముగా కుండ
నింతలోనే దివి కేఁగినావ?
వ్రాసిన పత్త్రముల్ ప్రచురింప కుండ నీ
వింతలోనే దివి కేఁగినావ?
గ్రంథరాజమ్ముల రచియింప కుండ నీ
వింతలోనే దివి కేఁగినావ?
తే॥ తాటియాకుల కృతుల ముత్తమ్ము కొఱకు
నరసి కైకొని రాకుండ నక్కటకట!
ఇంత లోపల దివికి నీ వేఁగినావ?
లలితగుణగేయ! చెలికాని లచ్చరాయ!
తే॥ ఆంధ్రసాహిత్య మభివృద్ధి నందునట్టి
యువిధమ్మును లెస్సగా నరయఁ దలఁచి
యెప్పుడు నీవొక్కఁడవె దివి కేఁగినావ?
లలితగుణగేయ! చెలికాని లచ్చరాయ!

## మాతృప్రశంస

26—11—1925

తే॥ వత్సరము దాటిపోయెదు వఱకుఁ గూడఁ
గాళ్ళ పైఁబెట్టుకొని నాకు నీళ్ళుపోసి
సంతసంబునఁ బోషణ సలిపినట్టి
తల్లిరో! నీకు నాదువందనము లివిగో॥

తే॥ ఉయ్యెలను బరుండఁగఁ జేసి యూపువేసి
జోజో నను గన్నతండ్రి జోజోయటంచుఁ
బొంగి పాడుచు నను నిద్రపుచ్చినట్టి
తల్లిరో! నీకు నాదువందనములివిగో!

తే॥ తప్పటడుగులు వేసెడి తరుణమందు
అక్క, అబ్బాయి, తాతయ్య, అమ్మ యనుచుఁ
జిన్నిమాటలు నాకెన్నొ చెప్పినట్టి
తల్లిరో! నీకు నాదువందనము లివిగో!

తే॥ విడువ కేడ్చుచు క్షీరమ్ముఁ గుడువ నపుడు
ఎవతె కన్నమన్నయ్యెనో యీ దినమున
వని యపుడె దృష్టిదీసి మే లరసినట్టి
తల్లిరో! నీకు నాదువందనము లివిగో॥

తే॥ రమ్యమైనట్టి వెన్నెలరాత్రియందు
నల్లదిగో చూడుమంచు జాబిల్లిఁ జూపి
ప్రేమతో బువ్వ దినిపించి పెంచినట్టి
తల్లిరో! నీకు నాదువందనము లివిగో॥

తే॥ చేసినంతనె తప్పు శిక్షించి నన్నుఁ
మెల్లముగ మంచిచెడ్డలు దెలియఁజేసి
మఱువ కేనాఁడు నాదు సేమమ్ముఁగోరు
తల్లిరో! నీకు నాదువందనము లివిగో

30—12—1925.

## అక్షయ

తే॥ జాతివైషమ్య రోగముల్ సడలఁ జేసి
కుజనసంతతిన్ వెంటనే కూలఁజేసి
భారతీయుల భాగ్యమ్ము పదిలపఱిచి
అక్షయా! సుస్థిరయశమ్ము నందు మమ్ము!

తే॥ అన్యదేశీయ వస్తువు లణఁగఁద్రొక్కి
తెలుఁగువారి విశేషముల్ దేటపఱిచి
గ్రామదేవత కింతేని స్థలము నీక
అక్షయా! సుస్థిరయశమ్ము నందు మమ్ము

తే॥ జనుల విజ్ఞానసంపత్తి ఘనముచేసి
జనుల భిన్నాశయమ్ములఁ జక్కఁజేసి
జనుల చిత్తములకు శాంతి మొనయఁజేసి
అక్షయా! సుస్థిరయశమ్ము నందు మమ్ము

తే॥ దేశముల యుద్ధములను సంధిల్లనీక
విభులకన్యోన్య మైత్రిని వెలయఁజేసి
సర్వమానవులను నీవు సమతఁజూచి
అక్షయా! సుస్థిరయశమ్ము నందు మమ్ము

## సమస్యలు

కం॥ కోటివిధమ్ములఁ దిట్టుట
నోటికిఁ జనుదెంచినట్లు న్యాయముగాదే
మేటి వయిన వాతోఁ బో
రాటమునకు నడుముకట్టి రారా యువజే!

కం॥ పుడనహాతుం డై యొక్కఁడు
హాదని దె యబ్జారివదన యంబుజనయనా!
మదకరిగమనా॥ కోరక
రదనా ననుఁగావవె యని రావముచేసెఁ॥

కం॥ ఏటికి యాలస్యము నవ్వు
లాటవిడిచి కౌఁగిలింపు మాఁగఁగఁ జాలన్
గాట మ్మగు మారునియా
రాటమునకుఁ జీరవిప్పి రావే యువతీ॥

కం॥ ఏరా! వెంకా! యిప్పుడు
నీ రుల్లినిఁ దవ్వఁగవలె నీ విటసరిగా
నారామమున కరిగి మం
దారమునకు నీళ్లుపోసి దబ్బున రారా॥

## గురుప్రశంస

1—1—1926

తే॥ దివ్య మైనట్టి కరుణార్ద్రదృష్టి తోడఁ
దే[illegible]యొక్కెడి ప[illegible]లఁ దెలియంజెప్పి
కన్న సుతునట్లు శిష్యునిఁ గాంచునట్టి
గురువుమహిమమ్ము వర్ణింప దరమె నాకు

తే॥ ఎఱుక లేనాదులని మది నెంచకుండ
నన్నికులములవారికి నవని యందు
నిపుణమతితోడ విద్యను నేర్పునట్టి
గురువుమహిమమ్ము వర్ణింపఁ దరమె నాకు॥

తే॥ కపట మింతయు లేక యే కాలమందు
దెలియ కున్నట్టి విషయముల్ దెలియఁజేసి
కరము, ఛాత్రుని సంతుష్టిపఱుచు నట్టి
గురువుమహిమమ్ము వర్ణింపఁదరమె నాకు॥
తే॥ వేదశాస్త్రపురాణముల్ విశదపఱిచి
ప్రకృతివిజ్ఞాన మొకకొంత పడయఁజేసి
శిష్యనౌన్నత్య మెపుడు వాంఛించునట్టి
గురువుమహిమమ్ము వర్ణింపఁదరమె నాకు॥

## హైందవకుమార

8—4—1926

తే॥ తాల్చుటకు శుభ్రమైన వస్త్రమ్ము లేక
కుడుచుటకుఁ బొట్ట నిండంగఁ గూడు లేక
శోకమును బొందు భవదీయసోదరులను
గన్నులారంగ వీక్షించి మిన్న కుంట
తగదు తగదు నీ కెప్పుడు హైందవకుమార!
తే॥ చెనఁటిమూఁకల మాటలు చెవిని బెట్టి
జాతి విడనాడి ద్వేషభావమ్ము నూని
అన్నదమ్ములతోడఁ బోరాడు చుంట
తగదు తగదు నీ కెప్పుడు హైందవకుమార!
తే॥ ప్రేమతోఁ బెట్టి సర్వమ్ము పెంచినట్టి
జననిదాస్యమ్ము దొలఁగింప శక్తినంత
ధారవోయక చూచుచు నూర కుంట
తగదు తగదు నీ కెప్పుడు హైందవకుమార!

తే॥ సరసకేతెంచినంత నసహ్యపడుచుఁ
దాకవలదంచు నీదుసోదరుల నీవె
కఠినమతితోడ వీక్షింపఁ గడఁగుచుంట
తగదు తగదు నీకెప్డు హైందవకుమార!

## భరతఖండాభిమాని 19—4—1926

తే॥ అన్యదేశము లందుఁ దయారుచేసి
నట్టి వస్త్రములకు నగ్ని ముట్టఁజేసి
ఖద్దరును సంతతమ్మును గట్టరయ్య
అనుచు బోధించు భరతఖండాభిమాని॥

తే॥ హాయనమ్మలు పదునెన్మి దరిగినంత
సభ్యులుగఁజేరి జాతీయ సంఘమందు
వడికినూలును బంపుఁడీ హాయకుండ
అనుచు బోధించు భరతఖండాభిమాని॥

తే॥ శాసనసభకు స్థానికసంస్థలకును
నిల్చినట్టి స్వార్థత్యాగి నిచయమునకు
నిచ్చివోటును ఖ్యాతివహింపరయ్య
అనుచు బోధించు భరతఖండాభిమాని॥

తే॥ బ్రాహ్మణేతరులార! యో బాపలార
హైందవవరేణ్యులార! యో యవనులార!
అలిగి మీలోన మీరు పోరాడఁ దగదు
అనుచు బోధించు భరతఖండాభిమాని॥

## ఆంధ్రపత్రికా ప్రశంస 20—4—1926

తే॥ పాసె నజ్ఞానతమము నీవలనఁగాదె
పాసె దారిద్ర్యమ్ము నీబోధవలనఁ గాదె
పాసెఁ బ్రజలమాంద్యమ్ము నీవలనఁగాదె
పత్రికామణీ! నినుఁగూర్చి పలుకవశమె?

తే॥ పావనులమైతి మేము నీ వలనఁగాదె
పడసితిమి జ్ఞానభూతి నీ వలనఁగాదె
వలచితిమి రాజ్యలక్ష్మి నీ వలనఁగాదె
పత్రికామణీ! నినుఁగూర్చి పలుకవశమె?

తే॥ సాంఘికార్థిక విషయముల్ చాటినావు
సులభమార్గమ్ము లెన్నియో చూపినావు
దేశభాషాభివృద్ధి కై తివిరినావు
పత్రికామణీ! నినుఁ గూర్చి పలుకవశమె

తే॥ వివిధదేశీయవిషయముల్ విశదపఱిచి
రాజకీయవిషయములు పరిచయపఱిచి
అతులవిఖ్యాతి జగతిని నందినావు
పత్రికామణీ! నినుఁ గూర్చి పలుకవశమె!

తే॥ పండితావళి సంస్తుతిఁ బడసినావు
సరసకవివర్యసన్నుతిఁ బొఁడసినావు
పడమిజేఁతుల మెప్పును బొందినావు
పత్రికామణీ! నిను గూర్చి పలుకవశమె!

# నవ్యదంపతులార! 6—5—1926

తే॥ సత్కథాశ్రవణమున నాసక్తిగలిగి
ప్రణవరూపుని యందుసద్భక్తిగలిగి
సల్పుఁడీ యిఁక నుండి సంసారయాత్ర
నవ్యదంపతులార! సన్మాన్యులార!

తే॥ ధర్మపద్ధతి నేనాఁడు దాటకుండ
వంశమర్యాద లేవియు వదలకుండ
గౌరవమ్ముగ నుఁడి ప్రఖ్యాతిగనుఁడి
నవ్యదంపతులార! సన్మాన్యులార!

తే॥ అవ్యయంబైన సుప్రణయమ్ముదాల్చి
సతముఁ శ్రీ పార్వతీమహేశ్వరుల పగిది
మెలఁగుఁడీ మీర లిఁకనుండి కలసిమెలసి
నవ్యదంపతులార! సన్మాన్యులార!

తే॥ ఆయురారోగ్య భోగభాగ్యములుగలిగి
సుగుణసంపన్నులైన సత్పుత్రులఁబడసి
జన్మసాఫల్య మందుఁడీ జగతియందు
నవ్యదంపతులార! సన్మాన్యులార!

తే॥ శిష్టజనలోకమంగళాశీస్సు లొంది
బాలకవిపద్యపంచకపటిమ నెంచి
హిత వెఱిఁగి తిరుఁగుఁడీ మీరికపు రేపుడు
నవ్యదంపతులార! సన్మాన్యులార!

# ఒకగ్రామము 18—5—1926

తే॥ ఇహమె పర మంచు మనసులో నెంచువారు
దేవుఁడే లేఁడటంచు వాదించువారు
పడపుఁగత్తెల వలలోనఁ బడెడివారు
గలరు పల్వురోకానొక గ్రామమందు॥

తే॥ అన్నదమ్ములు వ్యాజ్యెమ్ము లాడువారు
చెడుపనులుచేసి ద్రవ్య మార్జించువారు
దిక్కులేనివారలను బాధించువారు
గలరు పల్వు రొకానొక గ్రామమందు

తే॥ అహరహమ్మును ద్యూతమ్ము నాడువారు
చుట్టలను బారెడు పొడుగు చుట్టువారు
పిరికివారినిఁ గడు భయపెట్టువారు
గలరు పల్వురొకానొక గ్రామమందు

తే॥ తమకె శౌర్యమ్ము గలదంచుఁ దలఁచువారు
కోపమున బుజ్జ బిడ్డలుగొట్టువారు
పట్టుకొనిపోయి సొమ్ముగ బెట్టువారు
గలరు పల్వు రొకానొక గ్రామమందు॥

తే॥ పెట్టి కొండెముల్ పోట్లాటపెంచువారు
తాళ్ళయొద్దకుఁ జని కల్లుత్రాగువారు
తిండి లేకున్న మీసాలు దివ్వువారు
గలరు పల్వు రొకానొక గ్రామమందు॥

తే॥ చెట్లకడనుండి పరుల దూషించువారు
రెండుకాసులు చేర గర్వించువారు

గోడలకుఁ గాగితమ్ములు గొట్టువారు
గలరు పల్వు రొకానొక గ్రామమందు॥

## భరతమాత

20—5—1926

తే॥ కాళిదాసాది గీర్వాణ కవివరులను
నన్నయాద్యాంధ్రసుకవిపున్నగములను
ఘనుల నింకెందఱినో నీవు గాంచినావు
ప్రథితసద్గుణ సముపేత! భరతమాత!

తే॥ భోజ నవభోజరాజాది భూపవరుల
ధీరనుతుఁ డగు గాంధినిఁ దిలకుబుధుని
ఘనుల నింకెందఱినో నీవు గాంచినావు
ప్రథితసద్గుణ సముపేత! భరతమాత!

తే॥ భక్తజనవర్యులను మహాపండితులను
అమలగుణరత్నఖనుల శూరాగ్రసరుల
ఘనుల నింకెందఱినో నీవు గాంచినావు
ప్రథితసద్గుణ సముపేత! భరతమాత!

తే॥ భరతుఁ డేలుటచే నీకు భరత యనెడి
పేరు సంభవించె నటంచు సూరు లనిరి
శాస్త్రవేత్తల వాక్య మసత్యమగునె?
ప్రథితసద్గుణ సముపేత! భరతమాత!

తే॥ తల్లివై నీవు మాకిట దనరినావు
పూర్వభవమునఁ జేసినపుణ్యఫలము
వలనఁ గాకున్న జననిగాఁ బడయఁగలమె
ప్రథితసద్గుణ సముపేత! భరతమాత!

తే॥ బహుళమయి యున్న భవదీయ వైభవమును
గూర్చి సారెసారెకుఁ జెప్పఁగొనని వాఁడు
గలఁడె? చతురబ్ధికలితభూవలయ మందుఁ
బ్రథితసద్గుణ సముపేత! భరతమాత

## కనకదుర్గ

22—5—1926

తే॥ భారతీయులు శుభములన్ బడసి రేని
భారతీయులు సౌఖ్యమున్ బడసి రేని
భారతీయులు సంపదన్ బడసి రేని
తల్లి! నీకు నర్పింతు వందనశతమ్ము
కమ్రగుణవర్గ! బెజవాడ కనకదుర్గ!

తే॥ గాంధి శీఘ్రమే విఘ్నాబ్ధిఁ గడచె నేని
గాంధి యారోగ్యవంతుఁడై క్రాలె నేని
గాంధి రథ మీడ్వకుండనె కదలె నేని
తల్లి! నీకునర్పింతు వందనశతమ్ము
కమ్రగుణవర్గ! బెజవాడ కనకదుర్గ!

తే॥ నాయకులు సత్పథమ్మున నడచి రేని
ఖద్దరు పె బ్రజ లందఱుం గట్టి రేని
మతకలహములు సోదరుల్ మాని రేని
తల్లి! నీకు నర్పింతు వందనశతమ్ము
కమ్రగుణవర్గ! బెజవాడ కనకదుర్గ!

తే॥ త్వరగ మాదాస్యమును నీవు పాపి తేనిఁ
త్వరగ మాబాధ లన్నియుఁ దలఁగె నేనిఁ

ద్వారగ మా రాజ్యమేమాకు వచ్చు నేని
దల్లి; నీకు సమ్పింతు వందనములు
కమ్రగుణవర్గ! బెజవాడ కనకదుర్గ!




## ప్రభవ

16—3—27

సరిపడంగను వర్షముల్ గురియుఁగాత
పంట లిఁక నుండి హెచ్చుగాఁ బండుఁగాత
ధాన్యములధరల్ క్రమముగాఁ దగ్గుఁగాత
కలిమి యింటింటఁ దఱచుగాఁ గలుగుఁగాత
గురువరేణ్యుని శిష్యుండు గొలుచుఁగాత
శిష్యునిం దగ గురువు వీక్షించుఁగాత
దైవముగఁ గాంత భర్తను దలఁచుఁగాత
భర్తకాంతను సంతోష పఱుచుఁగాత
కొడుకు నభివృద్ధి జనకుఁడు గోరుఁగాత
ఎపుడు జనకాజ్ఞఁ గొడుకు పాలించుఁగాత
దివ్యగుణసము పేత మా దేశమాత
కఱవుదీర్చెడి బిడ్డలఁ గాంచుఁగాత
ప్రభవమహిమమ్ము పదిరెట్లు ప్రబలుఁగాత

## సుభాషితములు

21—10—1927

తే॥ అరయఁగా శరీరములు నిత్యములు గావు
వైభవంబన్న నదియు శాశ్వతముగాదు
మృత్యు వెల్లప్పుడును సన్నిహితము గాన
శీఘ్రముగ ధర్మకార్యముల్ చేయఁదగును.

తే॥ జలదములు భుజియింపవు సస్యములను
దమ జలమ్మును వాహినుల్ ద్రాగ వెపుడు
స్వాదు ఫలముల నేని వృక్షములు దినవు
ఇల సుజనసంపద పరోపకృతులకొఱకె!
తే॥ దాన మొనరింప కున్నఁ బేద యయి పుట్టుఁ
బేదఱికమున నఘము గావించు చుండు
నఘముచేతను నరకమ్ము నందుఁ బిదపఁ
బడసి జన్మమ్ము లేమిచేఁ బాపి యగును॥

## "ఆంధ్రరత్న" శ్రీదుగ్గిరాలగోపాలకృష్ణయ్య

14—6—28

తే॥ అయ్యొ! ఇదియేమి? రాజదేవాలయమును
గట్టుటయినను సంపూర్తి గాకమున్న
మాకు నింక స్వారాజ్యము రాకమున్న
ఆంధ్రరత్నమా! మీ రిటు లరుగఁ దగునె?
తే॥ కన్నులారంగ నింక మిముఁ గాంచు టెపుడొ
అమృతసమములౌ మీవాక్కు లాలకించు
టెపుడొ యెపుడొ యటంచు మే మెదురుచూడ
ఆంధ్రరత్నమా! మీ రిటు లరుగఁ దగునె!
తే॥ సర్వపక్షము లొకటిగా సలుపవలయు
శాసనోల్లంఘనమున నెజరుపవలయుఁ
గార్యములిఁక నెక్కడివి యెక్కడనె యుండె
ఆంధ్రరత్నమా! మీ రిటు లరుగఁ దగునె?

## ఆంధ్రరాష్ట్రము

1—6—38

తే॥ ఆంధ్రుఁ డను పేరు నాంటిల్లి యాంధ్రభూమి
యుంచును మురిసిపడు చుందు వంతే గాని
ఆంధ్రరాష్ట్రంబు గలుగలేదనెడి చింత
అంధ్రుఁడా! హృదయమున లేదయ్యె నీకు॥

తే॥ ఆంధ్రరాష్ట్రంబు గలుగలే దనెడి చింత
తలఁపులో నీకు నిజముగాఁ గలిగె నేని
మన్నుదినుపట్టి పెంచెరయూడ్కి నీవు
మందమందముగా నేల యుందు వాంధ్ర!

తే॥ ఆంధ్రరాష్ట్రంబు లేనిచో నాదరమ్ము
లేదు, సంపూర్ణ సౌఖ్యమ్ము లేదు నీకు
నీదుభాషకు నభివృద్ధి లేదు నీదు
దేశమునకు యశము లేదు తెలుఁగుబిడ్డ!

తే॥ ఎంతకాలంబు నిద్రపోయెదవు నీవు
మేలుకొనకున్న నిపుడైన మేలు లేదు
నడుము బిగియించి వడిగ ముం దడుగువేసి
ఆంధ్రపౌరుషమున్ జూపుమయ్య యాంధ్ర!

తే॥ పట్టుదల యున్నఁ గార్యమ్ము లెట్టివైన
నశ్రమంబున సిద్ధించు నందు బుధులు
గాన నీకుఁ బట్టుదలతోడఁ గడఁగు మాంధ్ర!
ఆంధ్రరాష్ట్రంబు శీఘ్రమే యావహిల్లు

తే॥ ఇతరరాష్ట్రంబులనొకఁ జూడ వేఁగినపుడు
ఎవ్వఁ డేనియు నీరాష్ట్ర మేది యంచు

నడుగనీవేమి యతనికి నుడువఁగలవు
ఆంధ్రుఁడా! నీవు లెస్సగా నరయుమయ్య!

## శతావధాని కవిరాజు శ్రీత్రిపురనేని రామస్వామిచౌదరి 21—2—42

సీ॥ శతవధానమ్మును పల్కె నీదుగురుండు
శతవధానమ్మును సల్పి తీవు
రసవంతముగఁ గైత వ్రాసె నీదుగురుండు
రసవంతముగఁ గైతవ్రాసితీవు
పౌరసన్మానమ్ము వడసె నీదుగురుఁడు
పౌరసన్మానమ్ము వడసి తీవు
గురుతరబిరుదముల్ వొరసె నీదుగురుండు
గురుతరబిరుదమ్ము పొరసి తీవు

ఆ॥ శతవధాన మొనర సల్పుట యందును
రసము చిందురీతి వ్రాయు టందు
గౌరవంబు మిగులఁ గాంచుట యందును
బోలినావు గురుని బుల్లిమామ!

సీ॥ అన్న గోపాలకృష్ణయ్యయుం డున్నచో
హర్షంబు దా నెంత యందువాఁడో
సచివోత్తముఁడు మునుస్వామి నేఁ డున్నచో
హర్షంబు దా నెంత యందువాఁడో

సఖవతంసుఁడు రామశాస్త్రి నేఁ డున్నచో
హర్షంబు దా నెంత యందువాఁడొ
అన్నలమిన్న యా పొన్నమ్మ యున్నచో
హర్షంబు దా నెంత యందునదియొ
ఆ॥ కోర్కితోడ నీకు గుడివాడపౌరులు
సలుపు చున్న యిట్టి సంత్కృతి నిటఁ
గన్నులార వారు గన్గొను భాగ్యమ్ము
పొడమ దయ్యె నకట! బుల్లిమామ!
తే॥ ప్రాణగల కవిత్వము వ్రాసి మానకుండ
మహాపతులచేత బుధశిరోమణులచేత
స్వాదరంబు సతంబు దా నందు చూట
మిగులఁ జేసిన పుణ్యంబె యగుఁ గతంబు॥
క॥ వ్రాసిరి విమర్శనంబులు
వ్రాసితివి విమర్శనాబు వానిని గన నీ
వ్రాసిన విమర్శనంబే
వాసికి నెక్కె నని చెప్పవచ్చును మామా!
ఆ॥ కాంచినాఁడ గురుని గౌరవింపఁగ మున్న
కాంచినాఁడ నిన్ను గౌరవింపఁ
గాంచఁ గోరుచుంటి గౌరవింపఁ గవుల
వీడ కింకను గుడివాడవారు॥
కం॥ కవిరాజు లుండువఱకును
కవిరాజా! నీదుకీర్తి గడు సాంద్రం బై
భువిపై నర్దైన రాజిలు
నవురా! యిల ధన్యజీవి వయితివి గాదే॥

# వదంతి

15—3—1942

సీ॥ చెన్నపట్టణములో నున్న వారల నెల్లఁ
జప్పనఁ బొమ్మనఁగచుఁ జెప్పి రంట
ఆ విశాఖపురిలో నేవాఁడు లేకుండ
నందఱు నెచటికో యరిగి రంట
బందరుపురిలోన బాంబు వేసె నటంచుఁ
బత్రికలో నేఁడు వ్రాసిరంట
విజయవాడకు నిప్పు వెళ్ళెఁ గూడ దటంచు
బైనుండి వార్తలు వచ్చెనంట
తే॥ అనుచుఁ గొందఱు దమలోన నాడుచుందు
రట్టిపల్కులు సత్యవాక్యమ్ము లంచుఁ
దలఁపఁబోకుఁడి మీరు మీతలంపు లందు
సరసమతులార! భరత దేశస్థులార!
సీ॥ గుంటూరులో నున్న కొట్ల నన్నిటిఁ గూడ
దొంగలు చనుదెంచి దోచి రంట
ప్రతిపురికిని గాక పల్లెపల్లెకుఁ గూడ
వదలక సోల్జరు వత్తు రంట
ఇఁకనుండి పోవుట కే పురంబునఁ గూడ
నొకటైనఁ బొగబండి యుండ దంట
ఆకాశమార్గమ్ము నం దుండి శత్రువుల్
వారమ్ము గడిచిన వత్తు రంట
తే॥ అనుచుఁ గొందఱు దమలోన నాడుచుందు
రట్టి పల్కులు సత్యవాక్యమ్ము లంచుఁ

దలఁచుఁ బొంకఁడి మీకు మీ తలఁపులందు
సరసమతులార! భరత దేశస్థులార!

# అభినవతిక్కన
# శ్రీ తుమ్మల సీతారామమూర్తిచౌదరి
# అప్పికట్ల సన్మానము 29—6—1942

కం॥ సన్మానము వడయుట గత
జన్మమునన్ బుణ్యమెంతో సలిపినఁ గలుగున్
సన్మానింపఁ బడుదు వన
మన్మానసమతి ముద బ్ధి మగ్నంబయ్యెన్
కం॥ ఆంధ్రులకు రాష్ట్ర మొదవమి
నాంధ్రుల కవమతి యటంచు నారసి మదిలో
నాంధ్రమున రాష్ట్రగానము
నాంధ్రుల మేల్కొల్ప వ్రాసి తహహాయనగన్॥
కం॥ శివరాముల యనుకంపను
లవమైనను బడయ మిగుల శ్రమమగునుగదా
శివరాముల యను కంపను
మివులం బడసితివి నీవు మిత్రవరేణ్యా!
కం॥ కమ్మని నీ కవితాపా
కమ్మును రుచిచూచినట్టి కవివరరసనా
గ్రమ్మితరుల కవితాపా
కమ్మును వాంఛింప దెప్డుఁ గవికులతిలకా!

క॥ కరి నెక్కుదువో లేదో
కరి నెక్కిన నెక్కుకున్నఁ గరము దలంపన్
గరినెక్కినవారలతో
సరిగావే రామమూర్తిసోదరి! సుకవీ!

## ఉత్కలాంధ్రులు 4—8—1942

సీ॥ జనసంఖ్య హెచ్చుగాఁ గను పట్టునని యెంచి
గంజాము జిల్లాను గలిపి యుంట
వైశాల్య మధికమ్ము నాశించి యాశించి
గంజాముజిల్లాను గలిపి యుంట
పురవరం బొక టైనఁ గొడకట్ట దని యెంచి
గంజాము జిల్లాను గలిపియుంట
ఉత్కలరాష్ట్రశుభోన్నతి భావించి
గంజాముజిల్లాను గలిపి యుంట
తే॥ కడఁగి గంజాముజిల్లానె గాక యింక
నాంధ్రమండలములు గొన్ని యా యొరిస్స
రాష్ట్రమునఁ జేర్చి యుండుట ప్రభువుల కిని
యేమిధర్మమొ యా లవ మైన నెఱుఁగరాదు॥

సీ॥ పరరాష్ట్రమున భవత్పురము చేర్చి రఁటన్న
నాంధ్రుఁడా! పగ నెంత యందినావొ!
ఆంధ్రవిద్యాశాల యచ్చోట లేకున్న
నాంధ్రుఁడా! పగ నెంత యందినావొ!

వేసి, డొమిసైల్ సర్టిఫికెటులఁ దెమ్మన్న
నాంధ్రుఁడా! వగ పెంత యందినావో
బదులకో నర్థంబుఁ బఠియింప వలెనన్న
నాంధ్రుఁడా! వగ నెంత యందినావో
తే॥ ఆంధ్రరాష్ట్రము సిద్ధించు నంత వఱకె
యిపుడ నుండరు మీ రోర్చ మందు ఋణము
గానఁ బరితాప మందుట మానుఁ డిపుడు
అన్నలార! యొరిస్స రాష్ట్రాంధ్రులార!
తే॥ తెలుఁగు వ్రాసి దస్తావేజు తెచ్చి నపుడు
చెల్ల దని రిజిష్టరు చేయ కుండఁ
ద్రిప్పివేయఁగ సబుకారి యప్పు డకట!
యెంత పరితపించెనో నీదు హృదయ మాంధ్ర!

## ఉపాధ్యాయుఁడు 29—1—1949

ఆ॥ పెద్ద చదువు చదువఁ బెద్ద యుద్యోగమ్ము
వడిగ వచ్చుననెడి భ్రాంతి వలనఁ
గష్టమన్న సుంత గణియింప కొకనాఁడు
శ్రద్ధతోడ నేను జదువుకొంటి॥
ఆ॥ చదువఁ జదువ దేహశక్తియు నశియించె
నప్పుబాధ నాకు నధికమాయెఁ
దారిలేక యపుడు తాతనాటి పొలమ్ము
నమ్మి తీర్చినాఁడ నప్పు నేను॥

ఆ॥ ఉద్యమించినాఁడ నుద్యోగమును బొందఁ
బెద్దవారిఁ జేరి పెక్కుసార్లు
చెప్పి వారితోడ సీఫార్సు చేయింప
ఖాళిలే దని యధికారి చెప్పె॥

ఆ॥ బ్రతుకలేక తుదకు బడిపంతు లగుటకే
నిశ్చయించికొంటి నెమ్మనమునఁ
జెప్పినాఁడఁ గొంత చెప్పించి నాఁడను
దొరక దయ్యెఁ బదవి దిరుగు చున్న॥

ఆ॥ తిరిగినందు వలనఁ బెరిగిపోయె వ్యయమ్ము
తుదకు నిదియుఁగూడ దొరక దయ్యె
నేమి చేయువాఁడ నేరేతి జరుగునో
యనుచు వగచి యున్న యంత నేను॥

ఆ॥ సెలవు పెట్టె రొకరు దెలిసె నా విషయమ్ము
మంచిదంచు లోన నెంచి యంత
నరిగి వేడుకొనఁగ నధికారి సెలవిచ్చె
సెలవు పోష్టునఁ బని చేయుకొఱకు॥

ఆ॥ సెలుపుచుండ సెలవు సంపూర్తి యగుటచే
సెలవు పెట్టినతఁడు చేయవచ్చి
చేరవచ్చితి నని చెప్పఁగా నాతోడ
నంతలోనె చింత యంకురించె॥

ఆ॥ చేయుచుంటిఁ బనిని సెలవు పెట్టినపుడు
ముదముతోడ రెండు మూఁడు నెలలు
గడవ నిట్లు గొంతకాలమ్ము బడిలోన
హెచ్చె సంఖ్య యపుడు వచ్చెఁ బోస్టు॥

ఆ॥ ఆజ్ఞ వచ్చె నాకు నా పోస్టులోఁ జేయఁ
జూచి కొందఱాజ్ఞ చూచి నన్నుఁ
గడచినావటంచుఁ గడుఁ స్తుతియింపఁగా
నంతులేని ముదము నందినాఁడ॥

ఆ॥ కడవ నేఁడ్లు రెండు గార్యాలయము చుట్టు
దిరిగి తిరిగి కాళ్లు దీపు పుట్టఁ
జెప్పి పర్మనెంటు చేయించుకొంటిని
బొందరాని శ్రమను బొంది తుదకు॥

ఆ॥ బదులు గొన్ని తీయఁబడు చుండెఁ గాఁబట్టి
నెలలు మూఁడుగాఁగఁ దొలఁగు మంచుఁ
బత్రిక లధికార్లు పంపఁగా బదులకు
నిచ్చె నాకు బడికి వచ్చినపుడె॥

ఆ॥ పర్మనెంటు చేయ భయ ముండ దనికదా
పర్మనెంటు కొఱకుఁ బ్రాకులాట
పర్మనెంటు వాని బడి నుండి పొమ్మన్నఁ
బర్మనెంటు వలన ఫలము దేమి?

ఆ॥ కఱవు తాఁడవించు కాలమం దధికారు
లున్న బదులలోనఁ గొన్ని తీసి
చదువు చెప్పువారిఁ జనుఁ డంట యనయఁగా
నియ్య దేమి తగవొ యెఱుఁగరాదు॥

# ఉపహారము

గాంధి మహాత్మునకుఁ బంపఁ బడినది. 3—3—1943

క॥ సత్యము పల్కుదు వెప్పుడు
సత్యము పల్కింపఁ జూతు జగతీజనులన్
సత్యస్వరూపుఁడ వనఁగ
సత్యేతర మగునె? విబుధజననుత గాంధీ!

క॥ ఏ నిముషంబున కేమో
యే నిమిషము నందు నిఁక నెట్టి విషయముల్
వీనులఁ బడునో యంచును
దీనాననులైరి భారతీయులు గాంధీ!

క॥ ఇరువదియొక్క దినంబులు
నిరశన దీక్షను వహించి నిర్మల మతితో
జరిపితి, వహ్వా యంచును
గరు మరు దందఁగ జనమ్ము గాంధిమహాత్మా!

క॥ తెలియని వారల కిప్పుడు
తెలుపఁగ భావించి, తపము స్థిరచిత్తుఁడ వై
సలిపి ముదమునఁ జెరలోఁ
దెలిపితి మహిమమ్ము నీవు దివ్యస్తుత్యా!

క॥ సతతానందము గనుమా
మతిమంతు లొసంగు నతులు మానక కొనుమా
శతవృద్ధుఁడ వై మనుమా
తతభ క్తిం బల్కు పల్కు తడయక వినుమా!

# గుడివాడ బోర్డుహైస్కూలు వార్షికోత్సవము

1—5—1943

ఆ॥ స్వాగతమ్ము మీకు నగాధిసనాధిపా!
స్వాగత మధికార వర్యులార!
సదయహృదయులార! సత్కార్యపరులార!
స్వాగతమ్ము మీకు స్వాగతమ్ము॥

ఆ॥ వత్సరమ్ము నిండ వార్షికోత్సవమును
జరుపు చుండు టిపుడు సముచితమ్ము
వార్షికోత్సవమ్ము వలనఁ దచ్చారిత్ర
విషయ మెల్లఁ బ్రజకు విశద మగును॥

కం॥ గుడివాడపురిం దా వెలయుచు
నడిగిన విద్యల నొసంగి యమ్మా! యెపుడున్
బడులందున మిన్న వగుచుఁ
గను, నున్నతపాఠశాల! ఖ్యాతిం గనుమా!

కం॥ వృద్ధిని గాంచితి మిగులన్
వృద్ధిని గను చున్న దాన వింకను దల్లీ!
వృద్ధిని గాంచుము విద్యా
వృద్ధుల యాశీస్సు లంది విద్యాలయమా!

కం! ఇపుడు జరిగినట్టు లే పేట నిచ్చోట
నుత్సవమ్ము దప్ప కొనరుఁ గాక
ఇపుడు వచ్చినట్టు లే పేట జనులెంచి
జనము మోద మొందవ సలుపుఁగాక॥

## శ్రీ పొట్లూరి వీరరాఘవయ్యచౌదరి

21—7—1943

కం॥ గురువుల దరిఁజేరి కొలిచి
గఱవని యా చదువు చదువె! కట్ట రయంగన్
గురువుల దరిఁజేరి కొలిచి
గఱచితిగదె రాఘవార్య! కడు మోదమునన్॥

కం॥ గురువునిఁ బూజించినచో
వరయశ మొనఁగూడు నంద్రు వసుమతి యందున్
గురువుని బూజించితిగదె
వరయశ మొనగూడె మున్నె వసుమతి యందున్॥

కం! దక్షిణదిశఁ గల విద్యా
దక్షులకడ కేఁగి వారి దయచే విద్యన్
దక్షత గడుఁ బడసితి గదె
ఈక్షితిని రాఘవార్య! యెల్లరు మెచ్చన్॥

కం॥ వరుఁడవు మార్దంగికులన్
వరుఁడవుగద నీవు వినయవంతులలోనన్
వరుఁడవు నీ వరయంగా
వరగుణులన్ రాఘవార్య! వసుమతి యందున్॥

కం॥ ధన్యము నీ కుగ్రామము
ధన్యము మన యాంధ్రు లుండు ధరణీస్థలమున్
ధన్యము భవదీయకులము
ధన్యగదా నిన్నుఁగన్న తల్లియు నార్యా!

## మామ

23—8—194

తే॥ అల్లుఁ డజ్ఞాని యైన నీ పతినిఁ గూర్చి
యల్లుఁ డజ్ఞానియని వెలికనుట రోఁత
యల్లుఁ డవగుణుఁ డైన నీ పతినిఁ గూర్చి
యల్లుఁ డవగుణుఁ డని వెలికనుట రోఁత!

తే॥ ఏవిధంబుగఁ బల్కిన నేమ్యా మగునో
ఏవిధంబుగ నన్న ననేమ్యా మగునో
యదియె మామకుఁ దెలియని దైన యపుడు
పలుకరా దల్లునిం గూర్చి పలుకు లెపుడు!

తే॥ ఇంట భుజియించి కొలు వొనరించు నతఁడు
పరుషశబ్దంబు నీనాఁడు పడక యున్న
మామ యల్లుని ననరానిమాట లన్న
భవ్యగుణుఁ డైన నల్లుఁడు పడునె? యిపుడు!

తే॥ అయిన నగుఁ గాక మామ ఏ వల్లునకును
నేను మామనుగద యంచు నీవు తలఁచి
యల్లునిం గూర్చి కాఱుల వాడుచుండు
తగదు తెగ దెప్పు మామకు ధరణియందు!

తే॥ అత్త కోడలిపైఁ దాను బెత్తనమ్ము
సలుపు చుండుట సతతమ్ముగలదు గాని
మామ యల్లునిపైనఁ దా మండిపడుచుఁ
బెత్తనమ్మును జేయుట వింతగాదె?

తే॥ అల్లునకు నిప్డు మామ నే నయితి నంచు
నెదను దలపోసి పొంగిపోయెదవు గాని

యల్లుఁడను మున్న మామ కే నయితి నంచుఁ
దలఁపులోన రవంతయుఁ దలఁప వెపుడు।

తే॥ మామ కల్లుఁడనై యుంట మఱచినావొ?
ధనము గలవాఁడ నంచును దలఁచినావొ?
పెత్తనముచేయ నీవు భావించినావొ?
యట్లు గాకున్న నల్లుని నాదు టేల?

తే॥ అల్లునిం జూచి కొఱకొఱ లాడు నొకఁడు
అల్లునిం జూచి పరిహాస మాడు నొకఁడు
అల్లునిం జూచి కాఱుల నాడు నొకఁడు
గలరు గల రిట్టి మామ లీ కాల మందు।

తే॥ బాల నిచ్చుట ఘనమని పల్కు నొకఁడు
బాలయే లక్ష్మి యంచును బలుకు నొకఁడు
బాలతో సాటి కాదని పలుకు నొకఁడు
గలరు గల రిట్టి మామ లీ కాలమందు।

తే॥ అల్లుఁ డాడిన దానికి నాగ్రహించి
పోరి యల్లుఁడు దన్నిట్లు దూఱె ననుచుఁ
జెప్పి యొసఁగును "యాంగీలు" చేయు చుండు
మామ మామయొక్క పెద్ద మాన్యెగాక॥

మహామహోపాధ్యాయ శ్రీ తాతా సుబ్బరామశాస్త్రి
17—8—1944

తే॥ అధ్యయన మందుఁ గాని యధ్యాపనమ్ము
నందుఁ గాని పరీక్షాధిక్య మందుఁ గాని
కలఁడె నీమఁబోలు విబుధుఁ డెక్కాలమందుఁ
బ్రథితగుణధుర్య! శ్రీ సుబ్బరాయశాస్త్రి!

## ఆంధ్రులార! 17—11—1949

తే॥ చెన్నపట్టణము పయి మీ కున్న హక్కు
వదలుకొనుఁ డన్న పట్టాభివాక్యములను
విన్నతోడనె మిగులఁ గోపించినారు
అంత తొందర యేల? మీ కాంధ్రులార!

తే॥ చెన్నపురి మనదే యని చెప్పి మఱల
అఱవమైత్రి సీతారామ యార్యుఁ డరెరె!
పలికె నిట్లని కాఱులు పలికినారు
అంత తొందర యేల? మీ కాంధ్రులార!

తే॥ రాష్ట్రపతి కాక మున్నాంధ్రరాష్ట్ర మందుఁ
జెన్నపురి చేరవలె నంచుఁ జెప్పినాఁడు
రాష్ట్రపతి కాఁగఁ జెన్నపురమ్ము పైన
హక్కు వదలుఁ డన్నాఁ డని యాడినారు
అంత తొందర యేల? మీ కాంధ్రులార!

## అభినవపోతన శ్రీ మంగిపూడి వేంకటశర్మ



### బందరు సన్మానము 26—3—1950

క॥ వందే మాతర మను కృతి
సుందరముగ వ్రాసినావు సూరులచేతన్
బొందితి వినతులు సత్కవి
బృందారక! మంగిపూడి వేంకటశర్మా!

కం॥ చదివిన పద్యమె మఱలం
జదువంగా బుద్ధి వొడముఁ జదువరులకు నా
యది చిత్రంబగు నీ కవి
త దగఁ గావించిన సుకృతం బగు సుకవీ!

కం॥ గాంధిశతకంబు వెండియు
గాంధిచరిత్రంబు వ్రాయఁ గలుగుట చేతన్
గాంధిపదాంబుజ సేవా
బంధురుఁడ వటంచు నిన్నుఁ బల్కెదు రార్యా!

కం॥ కాలవితంతువులకు నీ
కాలంబునఁ బెండ్లి చేయఁగాఁ దగు నంచున్
జాలఁగ బోధించితి వగ
రాలకుఁ జని, వేంకట కవిరాజా! పూజ్యా!

కం॥ పోతనభావం బరయఁగఁ
బూతం బగు ననుట లెస్స పుడమిని నెపుడున్
బోతనభావం బభినవ
పోతన్నా! నీది యనుట పోలదె? మిగులన్॥

## గ్రామోద్ధరణ

26—6—1951

కం॥ జనియించినదిన మాదిగ
నొనరించితి దేశసేవ యుర్వీస్థలిలో
జను లెల్లరు స్తుతియింపఁగ
గనుమా విజయమ్ము నీవు గ్రామోద్ధరణా!

కం॥ జనకుండు పూర్ణసుందరుఁ
డనయము బెజవాడయందు నధికప్రీతిన్

నినుc బోషించుచు నుండుట
గనcగా మోదమ్ము గల్గె గ్రామోద్ధరణా!
కం॥ కనుమా విబుధుల దీవెన
గనుమా సత్కవివర్యా ఘనసంస్తుతులన్
గనుమా యాదరణంబును
గనుమా సత్కీర్తి నీవు గ్రామోద్ధరణా!
కం॥ మంచి ముహూర్తంబున జని
యించితివటు గాకయున్న నీ దినములలోc
గొంచెం బేనియుc గొఱతను
గాంచక యుండంగc గలవె? గ్రామోద్ధరణా!
కం॥ కనcబడ నెల కొక్కతడవ
గనినారము మేము నిన్నుc గని మోదంబున్
గనcబడిన రెండుతడవలు
గను ముదమున కంతు లేదు గ్రామోద్ధరణా!

## శ్రీ కోలవెన్ను పరబ్రహ్మకవి పాముఱ్ఱు సన్మానము 30—6—1951

కం॥ వినcగా మీ పద్యంబులు
గనినాcడను చిత్తమందుc గరము ముదంబున్
గొనుమా నే నొసcగెడి యీ
ప్రణతుల నీ సమయమునc బరబ్రహ్మకవీ!
కం॥ కవితాకాంతయె రహిc దా
ను వరించెను నిన్నటంచు నుడువుట సత్యం

బవ్వు ముమ్మాటికి నవ్వురా
పవిమలచిత్తుఁ డవయితి పరబ్రహ్మకవీ!
కం॥ అచలాధీశుని విషయము
వచియించుటె దుష్కర మని వాకొను చుండన్
సుచరిత్రులు గొనియాడఁగ
రచియించితి పద్యములఁ బరబ్రహ్మకవీ!

## రాయలసీమ వాస్తవ్యులు 27—9—1951

తే॥ అన్యరాష్ట్రంబు లం దున్న యాంధ్రు లెల్లఁ
దెలుఁగురాష్ట్రంబు కొఱకు యత్నించు చుంట
వలదు రాష్ట్రంబు మా కని పలుకు చుంట
తగునె? రాయలసీమ వాస్తవ్యులార!
తే॥ చాలకాలమ్మునుండి రాష్ట్రమ్ము కొఱకు
ధీమదగ్రేసరులు ప్రయత్నించు చుండ
రాక యున్నందులకు విచారమ్ము లేక
వలదు రాష్ట్రంబు మా కని పలుకు చుంట
తగునె రాయలసీమవాస్తవ్యులార!
తే॥ ఆంధ్రమండలముల నున్న యాంధ్రు లెల్ల
రేక మనుమాట లెస్సగా నెఱిఁగి యున్న
వలదు రాష్ట్రమ్ము మా కని పలుకఁగల రే!
తగదు రాయలసీమవాస్తవ్యులార!
తే॥ తెలిసి తెలియని పలుకులు పలుకు చుంట
తెలిసి తెలియని పనులను సలుపుచుంట

తెలుగు రాష్ట్రంబులోఁ జేర్చ వలదటంచు
నడువఁ దగ దెవ్వ రైనఁ గన్నడిగులార!
తే॥ వ్యర్థముగ మీకు మాకు వివాద మేల?
హద్దులను గూర్చి పోట్లాట యనుచితమ్ము
గరము న్యాయమ్ముగాఁ బరిష్కర్త యినతో
నడువు పందియ మేల? కన్నడిగులార!

## ఆంధ్రదేశాభిమాని 10—10—1951

తే వాదు లేనట్టి యాంధ్రభూభాగ మెల్లఁ
జేర్చి యాంధ్రరాష్ట్రంబును జేయుటకును
సందియం బేల? ఇంకను జాగ దేల?
అనుచు వచియించు "ఆంధ్రదేశాభిమాని"
తే॥ ఆంధ్రులకు రాష్ట్ర మీయ నావంత యైన
నిండియా ప్రభుత్వమువారి కిష్ట మున్న
సత్వరమ్ముగ రాష్ట్రమ్ము సలుప రేల?
అనుచు వచియించు "ఆంధ్రదేశాభిమాని"
తే॥ వినయముగ సారెసారెకు వేడుకొన్నఁ
గారణమ్ములు గ్రమముగాఁ జేసుకొన్న
సత్వరమ్ముగ రాష్ట్రమ్ము సలుప రయిరి
అనుచు వచియించు "ఆంధ్రదేశాభిమాని"
తే॥ ఆంధ్రరాష్ట్రము కొఱకింక నడుగ నేల?
ఆచరించిన సత్యాగ్రహావ్రతమ్ము
సత్వరమ్ముగఁ దెలుఁగురాష్ట్రమ్ము గలుగు
అనుచు వచియించు "ఆంధ్రదేశాభిమాని"

# తెలుఁగునాడు

14...11...1951

పూర్వోన్నతిని గూర్చి పొంగుటేగాని
పూర్వ సంపదఁగూర్చి పొంగుటే గాని
పూర్వ సుస్థితిఁగూర్చి పొంగుటే గాని
ఈనాటి మీస్థితి యోచింత నుండె
ఆంధ్రులారా మీర లరయు రా వంత
మిముఁ గన్నయట్టి యా మీ తెలుఁగునాడు
సింధుదేశము కంటెఁ జిన్నదా యేమి?
ఆయుత్కలము కంటె నల్పమా యేమి!
ఆంధ్రదేశం బన్న నాదరం బున్న
సలుపరే రాష్ట్రంబు సందేహపడక
శౌర్యమ్ము మీలోనఁ జక్కగా నున్న
వీర్యంబు మీలోన వెలసియే యున్న
ధైర్యంబు మీలోనఁ దనరియే యున్నఁ
తెగు వింత మీలోన మిగిలియే యున్న
ఐక్యమ్ము మీలోన నమరియే యున్న
సాధింప క్రియయందు శ్రద్ధయే యున్న
ఆంధ్రసోదరులార! యాంధ్రరాష్ట్రమ్ము
నిముసమ్ములోఁ గల్గుఁ నిక్కవమ్మద్ది
శ్రీరామ శ్రీరామ శ్రీరఘురామ!
జానకీపతిరామ! సాకేతరామ!
ఆంధ్రుల విన్నపం బాలింప వేమి?
ఆంధ్రుల రోదనం బాలింప వేమి?
ఆంధ్రుల దుర్దశ నరయు రా వేమి?

